# తెలంగాణా వార్తలు

## సవర్ణులు హరిజనులతో కలిసి భజన

అరట్ల భజనసమాజముయొక్క విశేషలక్షణము

[విలేఖరి]

అరట్ల (జాగీరు) ౨౬-౧౦-౧౯౩౬

ఈగ్రామమున గృహసంఖ్య ౯ వందలు జనసంఖ్య ౪ వేలు ఒక ఆంధ్రపాఠశాలగలదు దానికి జాగీర్దారుగారు నెలకు రు ౫ లు ఇచ్చుచున్నారు మిగతద్రవ్యము పిల్లలే యిచ్చుకొందురు టపాసౌకర్యములేదు రాకపోకలకు రోడ్డులేదు పారిశుద్ధ్యముపలేకున్న

కాలపరిస్థితి

ఎండలు తీక్ష్ణముగానున్నవి హస్తకార్తెవర్షమువలన కొన్నికుంటలలోకి నీరువచ్చినది పశువులకు పచ్చిక యిప్పుడే కడుపునిండ దొరుకుట లేదు. ముందుగతయేమిఅని రైతులు ధైర్యము చెడియున్నారు వేసంగిదున్నకలు దున్నుటకారంభించినారు

గ్రంథాలయము

ఇది రక్తాక్షి సంవత్సరములో శ్రీయుత మాడపాటిహనుమంతరావుగారి గౌరవార్థము ఈ వ్వన వెంకటరామయ్యగారిచే స్థాపింపబడి, స్వంతభవనముగలదై విరాజిల్లుచున్నది ఇందు సుమారు ౪౦౦ గ్రంథములున్నవి ఇపుడు యుగవాణి, గోలకొండ, రయ్యతు అను మూడు పత్రికలువచ్చుచున్నవి ఈసంవత్సరము కార్యనిర్వాహకులు శ్రమలకుతోనై భవనములో రాళ్లున్న నివపరిపించి గోడలకు పాలగచ్చుచేయించి నూతనశోభకలుగ జేసినారు కాని చందాదారులు పుస్తకము, కార్యనిర్వాహకసంఘ చర్యలపుస్తకము సరిగాలేకపోవుట విచారకరము

భజనసమాజము

ఇదియు గ్రంథాలయముతోపాటు ప్రవర్తింపబడి, పలుపౌర్ణమములందు పుణ్యవారులలో భజనలు సలిపి పేరుపొందిదినదిన ప్రవర్ధమానమగుచున్నది కొంతవరకు చెక్కభజనగూడ అభ్యసించినారు ఎప్పటివలె యీసంవత్సరము గణేశోత్సవము అతివైభవముగా జరిపినారు. ఆనాడు హరిజనులు, సవర్ణులనుభేదములేక, ఎల్లరుకలిసి భజనలు చేయుచు ఊరేగింపుజరుపుట విశేషము దసరాకాడును అహింసాప్రచారము యీసమాజమువారిచేజరిగినవి కొంతవరకు దసరా జంతుహింసలు ఆగిపోయినందులకు సంతోషించుచున్నారు

## వైశ్య వితంతూద్వాహము

యాజ్ఞికముచేయుటకు స్థానిక బ్రాహ్మణుల భయము

ధాతనామసం౹౹ర ఆశ్వయుజ బ౹౹ ౨ ఆదివారమునకుసరియగు ౪-౧౧-౧౯౩౬ న నాడు మార్కాపేటతాలూకాసమీపమున పట్టి ఖమ్మంపహాడులో రేపాలమట్టయ్యగారి గృహములో వైశ్యవితంతువివాహము మహావైభవమున జరిగినది వరవిబంధువులు సమీపమునలేనందున గ్రామమునవుండుఉద్యోగులు గ్రామవైశ్యులు తక్కిన పలుకుబడిగలవారలు వివాహమునందు అభిమానముకలవారలై కార్యము సక్రమముగా జరిపించినారు ఈప్రాంతముబ్రాహ్మణులు యీ కార్యముజరిగించినచో తదితరబ్రాహ్మణుల వల్ల తమకు ఆవేశయిబ్బందులు కల్గునని భయపడినందున హైదరాబాదునుండి ప్రత్యేకము [illegible] విశ్వగడ్డపల్లయ్యగారు, లింగన్నగుప్త గారుకింగారవ జామాదరంగుప్తగారు మెదలగువారువచ్చిరి గడ్డంవారి యడవల్లి అను గ్రామమునుండి గందంరామయ్యగుప్త, వారిసోదరుడగు అ[illegible]రాయనర్సయ్యగుప్త (నల్లగొండ) గార్లను తమవెంట యడవల్లినుంచి వరదయాజ్ఞికునిగాంట విడుకొని దయచేసినారు ఇద్దరియాజ్ఞికులకలన వివాహము సక్రమముగాజరిగినది కట్టంగూరునుండి సుప్రసిద్ధవైశ్యపుంగవుడగు యిల్లెందుల మకుందయ్యగుప్తగారికొమారుడు, సూర్యాపేటనుండి భోనగిరివారు మొన్నమొన్ననే వితంతువివాహముచేసుకొన్న ఓరుగంటిసత్యంగారును శ్రీతెరటుపల్లి నర్సింహంగారు మొదలగు పెక్కుంద్రు వైశ్యులు పురుషులు స్త్రీలు ఆమోదముతో వివాహము జరిపినతరువాత శ్రీయుతభోనగిరిలక్ష్మయ్యగుప్త,లింగన్నగుప్తగార్లు ఇట్టివివాహములు శాస్త్రసమ్మతములని చెప్పి, వితంతువులను వివాహమాడినకొందరపెద్దలను పేర్కొనిరి

వరుడు శ్రీ రేపాల మట్టయ్యగుప్త పట్టి ఖమ్మంపహాడు, వయస్సు ౩౫ సంవత్సరములు.

వధువు- బిల్లంచర్ల క్రిష్ణయ్యగారి కొమార్తెయగు శ్రీమతి విశాలక్ష్మి పాతర్లపహాడు వయస్సు ౧౫ వ సంవత్సరములు.

వివాహానంతరం చందన తాంబూలాదులతో వచ్చినవారల సత్కరించినపిమ్మట వరుని గృహమున కులసోదరులు భోజనముచేసి వారివారిఇండ్లకువెళ్లిరి.

## క్షామసూచనలు

[విలేఖరి]

తెలంగాపల్లి, ౨౪-౧౦-౧౯౩౬ —

నిన్నటివరకు తటాకాదులలో నీరులేమిచే సీ అబిపైరులు చాలవరకుఎండిపోయెను పండిన అబిపైరులుగూడ నిన్నటివర్షమువల్ల విత్తులురాలిపోయెను.

నిన్న బుధవారంరాత్రి ౮ గంటలనుండి మొదలుజేసి నేడుఉదయము ౧౨ గంటలవరకుగూడ ఎడతెగకుండ గొప్పవర్షము కురిసెను ఇంకను ఆకాశమును మేఘములు ఆవరించుకొనియే యున్నది ఈవర్షమువలన లాభములేవియులేవుగాని నష్టములుమాత్రము పెక్కుగలవు "కరవులోవాంతి" యన్నట్లు ఇదివరకే పలునష్టములకులోనయిన కర్షకులను ఈవర్షము మితిలేనినష్టములపాలుజేసెను మొక్కచేనులు కోతకువచ్చి ఈవర్షమువలన కోనవీలులేక నష్టము, కోసినవి తడిసిమురిగిననష్టము జొన్నలుకోతకు వచ్చినవి ఈవర్షములో విపరీతముగా గాలియుండుటచేత భూమిపైకొరిగి, సగము మొప్పాతికవరకు విత్తులురాలిపోయినవి పోగామిగిలినవిత్తులు మొలకలువచ్చుచున్నవి చెలుకలుకూడ పడిపోయినవి ఇక రెండుమూడు దినములు ఈమేఘములిట్లే ఆవరించుకొనియున్న సర్వధ్వంసము కాగలదు రైతుకుమొత్తముమీద రెండణాలపంటపండునట్లగపడదు. సర్కారుపన్నులుకట్టుటకుమార్గము తోచకమిన్నుచూచుచు భగవంతుని ప్రార్థించుచున్నారు

### క్రొత్త అధికారి

హత్నూరు, ఆజూరు ౨౫ —

ఈగ్రామము మెదకుజిల్లాలో నవాబుసుల్తానుల్ ముల్కు బహద్దరుగారి పాయెగాగ్రామమైయున్నది ఈపాయెగాయొక్క సహాయకార్యదర్శియగు మౌల్వీఖూరషీదు ఆలీగారు మరణించినందున వీరిస్థానములో ఈగ్రామము తాలూకాధికారియగు మౌల్వీ అజ్మతుల్లాగారిని నియమించియుంచిరి ఇందుచే ప్రస్తుతము మౌల్వీ షర్ఫొద్దీన్ అహమదు మౌల్వీఫాజలుగారు తాలూకాదారిగా నున్నారు

## ఆంధ్రోద్యమప్రచారము

నల్లగొండప్రచారకుని నివేదిక

[౧౬-౧౦-౧౯౩౬ మొదలు ౨౨-౧౦-౧౯౩౬ వరకు]

మాదాపురంలో

ఈగ్రామములో ౩౫ గృహసంఖ్య ౨౦౦ జనసంఖ్యగల్గి, భోనగిరినుండి నల్లగొండపోవు రాచమార్గమునమున్నది. పోలీపురం వారంరెడ్డి గారు సభ్యులు.

కంచినేపల్లిలో

౧౧౦ గృహసంఖ్య, ౩౫౦ జనసంఖ్యగలదు రా చందుపట్ల సుదర్శనరావుగారి అధ్యక్షతను వర్తకసంఘవిషయము వాగీశ్వరబుచ్చయ్య గుప్తగారికి బోధింపనైనది

రెడ్లరేపాకలో

ఈగ్రామంగృహసంఖ్య ౩౦౦, జనసంఖ్య ౧౩౦౦ ఇచ్చటికితాలూకా ౧౨ మైళ్లు ప్రభుత్వ పాఠశాలలేదు ఖానగీపాఠశాలకురకబాగి రులయియున్నది ఎవ్వాళ్లకు ఒనమాలుచెప్పగలపంతుళ్లే ఈగ్రామం ఖానగీపాఠశాలకు వచ్చుచుందురు ఇంతకెక్కువ చెప్పగలపంతులు నాలుమాసముల కెక్కువయుండడు ఈప్రకారం ౪ సం౹౹నుండి అలవాటుపడినదీగ్రహచారము విజయదశమిరోజు జమ్మిదగ్గర శమీపూజానంతరం రాజభక్తి, ఐకమత్యము, పత్రికాపఠనచే గలుగులాభములు మత్తుపదార్థములవల్ల గలుగుచెడుగుణములు బోధించనైనది గ్రామస్థులు పత్రికాపఠనమునకు చందాపట్టికి ఏర్పాటుచేసి సంతకములొనర్చి "నవాజిష్ రీడింగురూం" పార్సీ ఇంగ్లీషు మిశ్రభాషయుతో ఒకపఠనాలయమును స్థాపింప నేటికి మహోత్సాహులైనందుకు ప్రశంసింపదగియున్నది

## [illegible] నాటకముపేర దుర్మార్గులు

(విలేఖరి)

భువనగిరి, ౩-౧౧-౧౯౩౬ —

ఈగ్రామమున సర్కారుల [illegible] పాల్గొనుజనపద్దుయొక్కకోటలో నాటకము నాంద్రము ౨౨-౧౧-౩౬ రోజు [illegible] నాటకము ప్రదర్శించుచుండగ, ౩౦ మంది నాటకమువద్దకువచ్చి "మాకద్దన్నలేదు, మాయందుదయయుంచి హాలులోకి పంపించుడని ప్రార్థించిరి. టిక్కెటులేక హాలులోకిపోవుటకు వీలుపడదని చెప్పిరి ఈమాటవినగానే వచ్చినవారు కోపావేశముతో టిక్కెటుకలెక్టరును బెదిరించి, వారి యిచ్చవచ్చినరీతిగాకొట్టి లోనప్రవేశించిరి. వీరు ప్రవేశించవడిమొదలు హాలంతయు అల్లరి అయిపోయెను. ఆయిమూపరులకు కథయొక్క అనుభవమే తెలియలేదు

## స్టేషనురోడ్డు రిపేరీఅవసరము

మధిర, అజూరు ౨౫ —

ఈతాలూకాగ్రామము బ్రిటిషుసరిహద్దులో గలదు ఇక్కడమిక్కిలిగా వ్యాపారముబండీలపాయీలలోనే జరుగుచుండును పోలీసుపాయీలకు ఎంతప్రాధాన్యముండవలెనో చెప్పనక్కరలేదు. స్టేషనునుండి గ్రామములో ప్రవేశించుబాట బాగుగాలేమిచే ప్రయాణీకులకు చాలాకష్టము జరుగుచున్నది వర్షాకాలములో మరీఅన్యాయము. బాటకిరుప్రక్కల రోడ్డుకుగాను కంకరరాయిపోసి యుండుటచే మరితకష్టమునకు గురికావలసి వచ్చుచున్నది రోడ్డునిర్మాణ మెప్పుడుజరుగునో? పారిశుద్ధ్యము బాగుగానున్నది తాలూకాధికారియగు శ్రీయుత దుర్గయ్యగారు ఇక్కడినుండి మార్చబడుటచే ఇప్పుడు మౌల్వీ అజీజుఅహమదుగారు వచ్చియున్నారు

తనమాతృభాషాజ్ఞానము లేని భారతీయుని
ఏమనవలెను?
అతనిని భారతీయుడని
చెప్పదగునా?"

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H E.H The Nizam's Dominions.

నిజాంరాష్ట్రములో ఏనిమిది జిల్లాలలోని ఆంధ్రుల లో మాతృభాషాభివృద్ధి సాధనము! గోలకొండ పత్రికలో ప్రకటనము

Vol. 11. | Monday 9—11—1936 | No. 52

# పశు పక్షులందలి గృహ నిర్మాణకళ

—అంబరీషుడు

ఉదరపోషణ, శరీరరక్షణముల కవసరమగు జ్ఞానము ప్రతిప్రాణి—క్రిమికీటములనుండి మానవునివరకు—యందు ప్రత్యక్షముగా ప్రకటితమగుచున్నది పరమేశ్వరసృష్టియం దన్యవిషయములలో మానవుని కగ్రస్థానము ప్రసాదితమైయున్నను వీనియందుమాత్రము సమానత్వమే కలదు ప్రతిప్రాణికి ఆహారము, తదానుకూల సంచలనమే గాక బుద్ధివైచిత్ర్యములనుండి శరీరము కాపాడుకొనుటకు, సేకరించిన ఆహారపదార్థముల నిలువజేసియుంచుకొనుటకు, తమ పసికూనల-సంతానము-పెంచి పోషించి శత్రువర్గమునుండి సురక్షితపరచుటకు యోగ్యమగు గృహమొకటి నేర్పడవలసియుండుటత్యవసరము పరమేశ్వర ప్రసాదితమగు విచక్షణా శక్తివలన, ఆది పరిణామవాదానుసారము ప్రకృతిలక్షణమే గానిండు, బుద్ధి బలమువలన మానవునియందు నానాటికి వికసించుచున్న గృహనిర్మాణజ్ఞానము వర్ణనాతీతము మనుష్యేతరసముదాయము, పశుపక్షిజాలము-వందికళ యెటుల విదితమగుచుండునో కనుగొనుటకొకింత ప్రయత్నించుట వివేకము గాజాలదు

గోవు, మహిషము, అజము, హయము, గజము మొదలగు చతుష్పాదజంతువుల కనాదినుండి మనుష్యునితో విశేషముగా నొకవిధమగు సంబంధమేర్పడియున్నది ఇవియేగాక మానవునితో సంబంధముగల యితర పశుజాలము సహితము తమకొరకు ప్రత్యేకముగా గృహములు నిర్మించుకొనకుండును వానికట్టి యవసరములే కొంతవరకు కలుగనవచ్చును వీని జీవితావసరములన్నియు-ఆహారము, కాలలు మొదలగునవి-మానవుడే స్వయముగా భారమువహించి సమకూర్చుచుండును

మానవసంఘముతో విశేషముగా సంబంధముగలపశువులు "గ్రామపశువులు"గా వ్యవహృతములగుచున్నవి మానవులే వీనిరక్షణభారము వహించుచుండుటవలన ఆహార విశ్రాంతులకైవి యంతగా పాటుబడవనవచ్చును వీనికొకవేళ [illegible] నవసరముదాయాంతర దశసంభవించిన నవ్యమృగములమాదిరి వనములందో, కొండలందో విడివిడిగా నివసించుటకుబూనుకొనక స్వజాతీయ సముదాయమునందే చేరియుండుటకు ప్రయత్నించుటవీని స్వభావము మహిషములు, ఒంటెలు కోలివశాస్త్రమునందుండి వీడిపోయిన [illegible] ఒంటరిగా నుండక గ్రామపశువు [illegible] ందే నొంటరిగానైనను నుండుచుండును

హరిణములు కుక్క మొదలగు వన్యమృగములవల్ల [illegible] కలవాటుపడినను [illegible] ప్రత్యేకముగా గృహములు నిర్మించుకొనక సముదాయరూపమున నివసించుటగానగను ఇవి విశాలమగుమైదానములందు, జటిలమగుపొదరిండ్లలో కొనసము లేర్పరచుకొని విహ[illegible] శ్రేణిమృగములు, ఒంటెలు [illegible] మనుండును వనదేవత వీనికివలయు వా

[ [illegible] పేజీ చూడుడు ]

లువయుంచుకొను యవసరము వీని కనుమాత్రమైన కలుగదనవచ్చును

శునకములకు, మార్జాలములకు గ్రామనూకరములకు మానవసంఘముతో సంబంధముండుటయు, లేకుండుటయు నుండుచుండును సంబంధముకలుగనిపక్షమున గో, మహిష, హయము లమాదిరి దాని కైప్రయత్నించక దూరముగానైను నవిశ్రమించుటకు ప్రకృతివలన కొంతయల వాటుపడియుండుట గావనగును ఈస్థితియందివి మానవులకంతగా యవసరముండనిస్థలము, గృహమును తమకు ప్రసూతికొలయములుగా—ఆకు, అలము, గడ్డి, అంధకారము మొదలగుయావశ్యక సామగ్రి యందుబాటులోనుండునటుల పరీక్షించి-నిర్ణయించుకొనచుండును ప్రసూతి సమయమునందేగాక రోజు వానివిశ్రాంతికైవిస్తీర్ణస్థలమును-పాదములతో పైగట్టిభాగముత్రవ్వి రాయిరప్పలతోపివేసి-గుంతలు, గుంతలుగాజేసుకొని వానియందుహాయిగా విశ్రమించుచుండును

దట్టముగా పొదరిండ్లలో కాపురమేర్పరచుకొనియుండు కుందేళ్లుమొదలగు "సుకుమార పశువులు" తమకు యోగ్యమగు గృహములు నిర్మించుకొనుచుండును అసున్నిత గృహములు వానిబుద్ధి వైలక్షణ్యముల వేనోళ్ల జాటుచుండును భూమిని కొద్దిగాత్రవ్వి లోతునందుగృహముల నిర్మించుకొనుచుండును వీనిగృహములు కేవలము శునకములగుంతలమాదిరిగాక విశాలములగు గదులుకలిగియుండును చూచువారికవి నొకటిగాలేక చిన్న గుంతగానున్నను యంతఃసంబధముమాత్రము నేర్పడియుండును వీనియందు-గృహభాగములు లేక గదులు-యాజమానునికొకటి యజమానురాలికొకటి, బాలురలకు వేరొకటి ఆహారపదార్థములుంచుకొనుటకు మరొకటి, అతిథియభ్యాగతులకొకటి కలిగియుండును గృహమునూదిరి రూపముమాదిరి, గృహద్వారము సహితము ప్రత్యేకత్వము బడసియుండుచుండును. ద్వారమాత్రములు వానికి మాత్రమే గోచరములుగాని వీనిహితమార్గము పుక్కిటపెట్టుకొను వీనిశత్రువుల కవియగమ్యములే అత్యాశాపేక్షితమై నేదేనియొకటిలోన ప్రవేశించిన దానికదిమృత్యుసధమే యుండవచ్చును సురక్షితముగానిరిగి ఆవలికి వచ్చుయాశ యున్నదేమో' కానిపిల్లిచే హాతమొనర్చబడి వీనికాహారము ... నిర్ణీతములగువానివి నివి యనాయాసముగాలో విక్షిప్త నిలువజేసుకొనుచుండును

ఇట్టిగృహములు తరుచుగా మారోపాయములు మాత్సర్యములందు, శాకచక్యములందు నంచనపోటుకులందు ప్రవీణతగల సృగాలవర్గజంతువులు నిర్మించుకొనుచుండును పొదరిండ్లలో కాపురము లేర్పరచుకొనువానియందు శశకములు—కుందేళ్లు—మిగుల అమాయకములు, నిరాయాసపశువులు వీని అమాయకత్వము వీనికి హానికలుగజేయుచుండుట కవికరుచుగాశంబికా శత్రువు పొదరిండ్లలో విశ్రమిస్తూన మే

ర్పరచుకొని సంతానముతో జీవయాత్ర సాగించుచుందురు.

సింహములు, వ్యాఘ్రములు, ఎలుగ్గొడ్డులు మొదలగు క్రూరమృగములకు కికారణ్యములు, నిర్మానుష్యయడాయలు, కొండగుహలు, లోయలు విశ్రామమందిరములు జీవి కనుకూలముగానుండుటకోయనుసటుల, చిన్నగృహములు ప్రత్యేకించుకొనక, మైల్పొవరణముగల యరణ్యములనే మహలులుగా నుపయోగించుకొనుచుండును, వీనిగృహస్థాశ్రమధర్మముల కివియే యనుకూలముగ నుండుచుండును

సర్పముల, మూషకములగృహములు ఆశ్చర్యకరములు సర్పములు స్వయముగా గృహములునిర్ణయించుకొనుటయందు నిర్మించుకొనుట యందసమర్థతయనవచ్చును పరగృహాన్వేషణమే వీనిస్వభావము మూషకములను, (పిపీలిక) చీమలు - పుట్టములను స్వయగృహములుగా నేర్పరచుకొనుటయందలి యసమానములు కేవలమొక గృహనిర్మాణమేగాక యింటివారిని సహితము, ఇంచుక సంకోచించక, బుక్కపెట్టుటయందు వీనికిపెట్టినదిపేరు తమయాధిపత్యమునకు గౌరవమునకిదియే తగుమార్గముగాగా భావించి ప్రవర్తించుటగానవగును ఈఆక్రమణమువలన వీనికివిశ్రాంతిమందిరములు, ఆహారము రెండునులభించుచున్నవి వీనిగృహములందు స్వచ్ఛమగువాయువు ప్రసరించుటకు చక్కని సౌకర్యములు యేర్పడియుండును. విశ్రమించు ప్రదేశము మిగులసున్నితముగా మృదువుగా, హాయిగానుండుచుండును మచ్చుకైనను యిసుకముక్క యుండకనుండును

ఆవ్యాప్తియాక్రమణము వందారితేరిన యీ దుర్నీతిదాయకములగు సర్పములభారినుండి తప్పించుకొనుటకు మూషకములు తమగృహములకు రెండుద్వారము లేర్పరచుకొనుచుండును సర్పములనుండి గృహాక్రమణమేగాక జీవాపహరణము సంభవించుటచే సర్పమొకవేళయానుకూలసమయమున గృహప్రవేశమొనర్చిన వెంటనే మృత్యుముఖమునుండి తప్పించుకొనుటకే రెండవద్వారము నిశ్చితమైయుండు మరియు మక్కసూటిగా వచ్చుసర్పమునకీ రెండవద్వారరహస్యము-కోటలందు సమరసమయమున ఆహారపదార్థము సమకూర్చుటకులేక అపజయసమయమున పరుగెత్తి ప్రాణములుకాపాడుకొనుటకొక గవాక్షద్వారముండునటుల—ఇలియపడునందువ మూషకవర్గమునకిదియే మహా ప్రసాదమగుచుండును.

గ్రామమూషకములు— వీనినే గృహమూషకములనుచుందురు—నిర్మించుకొను గృహములు—బిలములు—వానియందలి విశ్రామ మందిరముల శ్యాశ్చర్యకరములు ముఖ్యము గావివి తమపిల్లలకై నిర్ణయించు ప్రదేశములు చూడతగియుండును మూషకము ధాన్యహారి. మానవగృహములందలి పలుధాన్యములు భక్షించుటచే

ఆహారమును ల్వజేసుకొనకుండును అవసరసమయమునందు వలయునాహారమందుబాటులోనుండుటవలన యిష్టపూర్తిగాతినుడీచిబలిసి బలిష్ఠములైయుండును శరీరపరిమితి ననుసరించి మానవునికి మాసమువరకు ముగియునాహారము మూషకమున కొకదివసమునకు సరిపోవునని శాస్త్రజ్ఞులునిర్ణయించిరి కొయకష్టములను లొంగకయుండవందున పోషణగానుండును మానవాహారముతో దీనిరక్తము వృద్ధియగుటచే మానవరోగములకు, ముఖ్యముగా ప్లేగుజాడ్యమునకు గురియగుచుండును దీనియాహారము, ఆరోగ్యముగురించి మరొకమారు వివరించబడును

పసికూనలకై నివిరేర్పరచు ప్రదేశములు మిక్కిలి మృదువుగానుండును ప్రదేశమంతయు మెత్తనివస్తువులతో నిండియుండును. మానవునికి విలువగలవస్తువులను—వస్త్రములు, గ్రంథములు మొదలగువవి—సంగ్రహించి, దంతములతో వానిని తునకలుతునకలుగా కత్తరించి, వానితోసిద్ధమగు మృదుశయ్యపై బాలింతరాలు తనసంతానముతో హాయిగగడుపుచుండును ప్రసూతికేటులసిద్ధమగు సూతికాశయ్య, మానవనష్టపరిమితియనుసరించి, కొన్నివేలరూప్యములు విలువజేయునదియగుట నిశ్చయము వీనియందలి పుర్వృద్ధివలనవీనికి "పుబెదల" నునుపనామ మొకటి యేర్పడినది

పుచ్ఛధారిజీవులలో నడుతమాత్రము భూమియంతర్భాగమునగాక పైననో, గోడల ధ్వాన్తాంశములందునో, మానులందునో తమ గృహములనిర్మించుకొనుచుండును వీనియుండేవివి తమ సుఖశయ్యామందిరముల నిర్ణయించుట వీనిస్వభావము, సుఖశయ్యకద్దము వివిధములను సార్థకమగుచున్నది పట్టెమంచము మఖమలు పరుపుకన్న హాయిగానుండును దీనివలువేపులశయ్యనేగాక, విద్రయంపు పొరలిన-నూలుపోగులు, పత్తి దూది, బట్టపేలికలు, వస్త్రఖండములు మొదలనవి చక్కగా పరచియుంచబడును

ఏమి తనగృహము భూమిలోన చతుష్కోణరూపమునగాక గుండ్రముగా గుమ్మటమువలె యేర్పరచుకొనుచుండును చూచువారికవి "సుబుమినార్"లేక వారణాసియందలి "మఖ్బరాశిఖరము"గనో యనుపించుచుండును లేదా మదరాసునందలి "హైకోర్టు"గానోనుండి హైకియంచికనుపించును వీనిద్వారము చిన్నగానుండును లోనిపంచపాళి—మనసాల అతి విశాలముగానుండును వీనియందిని తనబలములమాదిరి యుండునీకల ఘనబుకొనివిడించుచు తనగృహస్థాశ్రమ ధర్మము నిర్వర్తించుచుండును

పశుగృహములందు చాలావరకొక యజమానికవసరములు పూర్తిజేయు వైశాల్యము మాత్రమేయున్నను కొన్నిటియందు మాత్రము తి యభ్యాగతులకు విశ్రమింపు యవకాశములు గృహ నిర్మాణకాలమునందే యేర్పరుపబడు విషయము జ్ఞప్తియందుంచుకొనదగినది [illegible]

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad. Editor A. BalakrishnaReddy.